శ్రీరామజయం

# ఆంజనేయదండకము

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం ప్రశస్తాత్మకాయం భజేవాయుపుత్రం భజే వాలగాత్రం భజేహంపవిత్రం భజేసూర్యమిత్రం భజేరుద్ర రూపం భజేబ్రహ్మతేజంబటంచున్ ప్రభాతంబుసంధ్యాలన్ నీ నామ సంకీర్తనల్ జేసి నీరూపువర్ణించి నీమీద నే దండకంబొక్కటింజేయ నూహించి నీమూర్తిసేవించి నీసుంద

రంబెంచి నీదాస దాసుండనై నిన్ను నేఁ గొలిచెదఁ
నిన్ను నేదలచెదఁ నీకటాక్షంబునఁ జూచితే వేడుకల్ సేసితే
నామొరాలించితే నన్ను రక్షించితే అంజనాదేవి గర్భాన్వయా
దేవ నిన్నెంచ నేనెంతవాఁడ దయాశాలివైజూచితే దాతవై
బ్రోచితే దగ్గిరన్నిల్చితే తొల్లిసుగ్రీవుకుఁ మంత్రివై స్వామికా
ర్యంబునందుండి శ్రీరామసౌమిత్రులంజూచి వారిన్విచారించి
సర్వేశుఁబూజించి సభ్భానుజుంబంటుగావించి యవ్వాలినింజంపి
కాకుత్థ్సతిలకుం దయాదృష్టి వీక్షించి కిష్కింధ నేలించి శ్రీ
రాము కార్యార్థమై లంక కేతెంచియుఁ లంకిణిఁ జంపియుఁ

లంకయుం గాల్చియుం భూమిజం జూచి యానంద ముప్పొంగి యాయుంగరంబిచ్చి యారత్నముం దెచ్చి శ్రీరాముచేనిచ్చి సంతోషులం జేసి సుగ్రీవుడాయంగదా జాంబవంతాది నీలాదులం గూడి యాసేతువుందాటి వానరల్ వీక పెన్మూకలై దైత్యులం దుంచగా రావణుండంత కాలాగ్ని రూపోగ్రుడై కోరి బ్రహ్మాండమైనట్టి యాశక్తినిన్ వేసి యాలక్ష్మణున్ మూర్ఛగావించగా నప్పుడే వేగ సంజీవినిం దెచ్చి సౌమిత్రికిన్నిచ్చి ప్రాణంబు రక్షించగా నాకుంభకర్ణాదులన్ వీరులం బోరి శ్రీరాము బాణాగ్నిచే వారలన్ రావణుం జంపగా జేయగా నంతలోకంబులానందమై

యుండ నవ్వేళలం దవ్విభీషాఖ్యునిఁ వేడుకఁ దోడుకొని వచ్చి
పట్టాభిషేకంబు జేయించి సీతామహాదేవినిం దెచ్చి శ్రీరాముతోఁ
జేర్చి అయోధ్యకుఁ వచ్చి పట్టాభిషేకం బనేకంబు సంరంభమై
యున్న నీకన్న నాకెవ్వరుం గూర్మి లేరంచు మన్నించినఁ రామ
భక్తప్రశస్తంబుగా నిన్ను నీనామసంకీర్తనల్ జేసినఁ పాపముల్
బాయవే భీతులందీరవే భాగ్యముల్ గల్గవే సర్వసామ్రాజ్య
ము ల్సర్వసంపత్తులుఁ గల్గవే వో వానరాకార యోభక్త
మందార యోపుణ్యసంచార యోధీర యోవీర నీవే సమస్తంబు
నీవే జయంబంచు నీవే మహా ఫలముగా వెలసి యాతారక బ్రహ్మ

మంత్రాను సంధానముం జేయుచున్ మేలిమిన్ వజ్రదేహంబు
నుండాల్చి శ్రీరామ శ్రీరామ శ్రీరామయంచున్ మనఃపూతమై
యెప్పుడుం దప్పకం దండనాజిహ్వా యందుండగన్ దీర్ఘదే
హంబునం నీవుత్రైలోక్య సంచారివై రామనామాంకిత ధ్యా
నివై బ్రహ్మవై బ్రహ్మతేజంబునన్ రౌద్రనిజ్వాల కల్లోలహా
వీరహనుమంత ఓంకార ఓంకార ఓంకార శబ్దంబులం క్రూర
సర్వగ్రహా నీకమున్ ప్రేతభూతాళి పైశాచులన్ శాకినీఢాకినీ
మోహినీ గాలిదయ్యంబులం నీదువాలంబునం జుట్టి నేలంబడం
గొట్టి నీముష్టిఘాతంబులం బాహుదండంబులం రోమఖండంబు

లంద్రృంచి కాలాగ్ని రుద్రుండవై బ్రహ్మప్రభాభాసితంబైన నీ దివ్య తేజంబునుంజూచి తే రార నాముద్దు నరసింహా యంచుదయాదృష్టివీక్షించి నన్నేలునాస్వామి నాథా నమస్తే సదా బ్రహ్మచారి నమస్తే వాయుపుత్రా నమస్తే ప్రతాపూర్ణహారీ నమస్తే నమస్తే నమస్తేనమః

శ్రీ ఆంజనేయదండకము సంపూర్ణము.

# ఆంజనేయాష్టోత్తర శతనామశ్లోకాః

ఆంజనేయోమహావీరో హనుమాన్మారుతాత్మజః।
తత్వజ్ఞానప్రదస్సీతా దేవీముద్రాప్రదాయకః॥ ౧॥
అశోకవనికాచ్ఛేత్తా సర్వమాయావిభంజనః।
సర్వబంధవిమోక్తాచ రక్షోవిధ్వంసకారకః॥ ౨॥
పరవిద్యాపరీహారః పరశౌర్య వినాశనః।
పరమంత్రనిరాకర్తా పరయంత్రప్రభేదకః॥ ౩॥

సర్వగ్రహ వినాశీచ భీమసేన సహాయకృత్।
సర్వదుఃఖహరస్సర్వ లోకచారీమనోజవః॥ ౪॥

పారిజాతద్రుమూలస్థ స్సర్వమంత్రస్వరూపవా।
సర్వతంత్రస్వరూపీచ సర్వయన్త్రాత్మక స్తదా॥ ౫॥

కపీశ్వరోమహాకాయ స్సర్వరోగహరఃప్రభుః।
బలసిద్ధికరస్సర్వ విద్యాసంపత్ప్రదాయకః॥ ౬॥

కపిసేనానాయకశ్చ భవిష్యచ్చతురాననః।
కుమారబ్రహ్మచారీచ రత్నకుండలదీప్తిమాన్॥ ౭॥

సంచలధ్వానసన్నద్ధ లంబపానశిఖోజ్వలః।

గంధర్వవిద్యాతత్వజ్ఞో మహాబలపరాక్రమః॥ ౮॥

కారాగృహవిమోక్తాచ శృంఖలోబన్ధమోచకః।

సాగరోత్తారకఃప్రాజ్ఞో రామదూతప్రతాపవాన్॥ ౯॥

వానరః కేసరీపుత్ర సీతాశోకనివారణః।

అంజనాగర్భసంభూతో బాలార్కసదృశాననః॥ ౧౦॥

విభీషణప్రియకరో దశగ్రీవకులాంతకః।

లక్ష్మణప్రాణదాతాచ వజ్రకాయోమహాద్యుతి॥ ౧౧॥

చిరంజీవీరామభక్తో దైత్యకార్యవిఘాతకః।
అక్షహంతాకాంచ నాభః పంచవక్త్రోమహాతపాః॥ ౧౨॥
లంకిణీభంజనశ్శ్రీమాన్ సింహికాప్రాణభంజనః।
గంధమాదనశైలస్థో లంకాపురవిదాయకః॥ ౧౩॥
సుగ్రీవస్సచివోధీర శ్శూరో దైత్యకులాంతకః।
సురార్చితోమహాతేజో రామచూడామణిప్రదః॥ ౧౪॥
కామరూపీపింగళాక్షో వార్ధిమైనాకపూజితః।
కబళీకృతమార్తాండమండలోవిజితేంద్రియః॥ ౧౫॥

రామసుగ్రీవసంధాత మహారావణమర్దనః।
స్ఫటికాంభోవాగధీశో నవనాత్పతిపండితః॥ ౧౬॥
చతుర్బాహుర్దీనబంధుర్మహాత్మాభక్తవత్సలః।
సంజీవననగాహర్తా శుచిర్వాగ్మీదృఢవ్రతః॥ ౧౭॥
కాలనేమిప్రమదనో హరిమర్కటమర్కటః।
దాంతశ్శాంతప్రసన్నాత్మా శతకంఠమదాపహృత్॥
యోగరామకథాలోల సీతాన్వేషణపండితః।
వజ్రదంష్ట్రో వజ్రనఖో రుచివీర్యసముద్భవః॥ ౧౯॥

ఇంద్రజిత్ప్రహితామోఘబ్రహ్మాస్త్రవినివారకః।
పార్థధ్వజాగ్రసంవాసీ శరపంజరభేదకః॥ ౨౦॥
దశబాహుర్లోకపూజ్యో జాంబవత్ప్రీతివర్ధనః।
సీతాసమేతశ్రీరామ పాదసేవాదురంధరః॥ ౨౧॥

ఇత్యేవం శ్రీహనుమతో నామ్నా మష్టోత్తరంశతం యఃపఠే
చ్ఛృణుయాన్నిత్యం సర్వాన్కామానవాప్నుయాత్ ॥

ఇతి కాళికారహస్యే ఆంజనేయాష్టోత్తర
శతనామశ్లోకాస్సంపూర్ణాః.

